# కందుకూరి వీరేశలింగంపంతులు
# అధిక్షేప రచనలు

సంపాదకుడు

డా॥అక్కిరాజు రమాపతిరావు




**తెలుగు విశ్వవిద్యాలయం**

లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,

నాంపల్లి, హైదరాబాదు - 500 004

**1994**

# ఆముఖం

తెలుగులో అలబ్ధ, అముద్రిత గ్రంథాల్ని ప్రచురించి ప్రజలకందించాలని తెలుగు విశ్వవిద్యాలయం ఇటీవల నిర్ణయించింది. ముందుగా అందుకు యోగ్యమైన పుస్తకాల్ని గుర్తించి వాటి ప్రాధాన్యాన్నిబట్టి వరుసక్రమంలో ముద్రించే కార్యక్రమాన్ని కూడ వెంటనే చేపట్టినాం. తత్ఫలితంగానే ఇప్పుడీ "కందుకూరి వీరేశలింగం పంతులు అధిక్షేప రచనలు" అనే గ్రంథాన్ని ప్రచురిస్తున్నాం. ఈ అలబ్ధ, అముద్రిత గ్రంథాల్ని గుర్తించే ప్రణాళికను కూడ క్రమబద్ధంగా చేపట్టినాం. వేటపాలెంలోని సారస్వతనికేతన్ గ్రంథాలయం, రాజమహేంద్రవరంలోని గౌతమీ గ్రంథాలయం వంటి పురాతన గ్రంథాలయాల్లో లభించే ఈ రకం పుస్తకాల్ని, అవి లుప్తమైపోకముందే నిపుణులచేత ఎంపిక చేయించి ముందుగా జిరాక్స్ కాపీలు తీయించి భద్రపరుస్తున్నాం. ఆ తర్వాత వాటిని దశలవారీగా ముద్రించి పాఠకుల కందించనున్నాం.

ఆధునిక తెలుగు కవితావిర్భావం, దాని వికాస పరిణామాలగురించి అధ్యయనం చేసేటప్పుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారి `సరస్వతీనారదవిలాపం', కట్టమంచి రామలింగారెడ్డిగారి `ముసలమ్మ మరణం' వంటి కావ్యాల ప్రసక్తి రాకుండా ఉండదు. `సరస్వతీనారదవిలాపం'లో క్షీణదశకు చేరిన ప్రాబంధిక ధోరణులు, వెర్రిపోకడల దుస్థితి గూర్చిన ఆవేదన అధిక్షేపరూపంలో వ్యక్తం కాగా, `ముసలమ్మ మరణం'లో వస్తువరణం ద్వారా ఆధునికతవైపు తొంగిచూడడం జరిగింది. ఈ రెండు లఘుకావ్యాలు మనం ఇరవయ్యో శతాబ్దంలో

అడుగుపెడుతున్న సందర్భంలో సాహిత్య పరిణామక్రమంలో సూర్యోదయానికి పూర్వం తూర్పుదిక్కున వెలసిన వెలుగురేఖల సవ్వడివంటివి.

కందుకూరి `సరస్వతీనారద విలాపం'తో పాటు ఆయా సందర్భాల్లో వారు రాసిన అధిక్షేపకవితలు - `అభాగ్యోపాఖ్యానం', `సత్యాద్రౌపదీ సంవాదం', `పత్నీవ్రత ప్రబోధం'లను కూడ ఇందులో సంకిలితం చేసి "కందుకూరి వీరేశలింగం పంతులు అధిక్షేప రచనలు" పేరుతో ఇప్పుడు ప్రచురిస్తున్నాం.

ఈ రచనలు సంపాదించి దీనికి సంపాదకత్వ బాధ్యత వహించిన విద్వాంసుడు, పరిశోధకుడు డా॥అక్కిరాజు రమాపతి రావుగారికి మా కృతజ్ఞతలు. వారు కందుకూరి వారిపై పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టం పొందిన పండితుడు కావడం మరీ మాకు సంతోషదాయకం.

హైదరబాదు
**14-11-93**
శ్రీముఖ, దీపావళి

*పేర్వారం జగన్నాథం*
ఉపాధ్యక్షులు
తెలుగువిశ్వవిద్యాలయం
హైదరబాదు

# సంపాదకీయం

ప్రమాణాన్ని బట్టి చూసినా కందుకూరి వీరేశలింగంపంతులు ఆధునికాంధ్రసాహిత్య యుగకర్త. ఆయన పుట్టేదాకా సమాజ సాహిత్య బింబప్రతిబింబతలు నిశ్చయ ప్రతిపత్తి పొందలేదు తెలుగు సాహిత్యంలో. ఆధునిక తెలుగు సాహిత్యానికి ఆయనే ప్రభవస్థానం. తర్వాత శతాబ్దులకు విభవస్థానం.

వీరేశలింగం పంతులుగారు పుట్టడానికి పూర్వం సుమారు తొమ్మిది వందల సంవత్సరాల తెలుగు సాహిత్య వికాసం వుంది. మహా ప్రతిభావంతులైన కవులున్నారు. అయినా వారికి సంస్కృత సాహిత్యమే ప్రమాణం. ఆలంకారిక సంప్రదాయమే వరవడి. సంస్కృత కావ్య నాటక రీతులే ఆచార్యస్థానం. సంస్కృత సాహిత్య శాస్త్రమే శిరోధార్యస్థానం. తర్వాత తర్వాత అర్వాచీన శతాబ్దులలో యక్షగానాలలో సమకాలీన జీవితం కొంతవరకు ప్రతిబింబించినా ఇవికూడా పురాణ కథలనే ఆశ్రయించాయి. అప్పటంగా తాను బతికి కష్టసుఖాలనుభవిస్తున్న సంఘం గురించి రచనలు చేయడమనేది ఈ వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో వీరేశలింగంతోనే ఆరంభమైంది. ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియల కెన్నిటికో వీరేశలింగమే ఆద్యుడు. వీరేశలింగం రచయితగా ఆవిర్భవించే నాటికి తెలుగులో వచన రచన చాలా విరళం. దక్షిణాంధ్ర సాహిత్యంలో వచన రచన ప్రత్యేక క్రియగా రూపుదిద్దుకొన్నది. అయితే ఈ వచన రచనలు కూడా ఇతిహాస, పురాణ గాథా సంబంధాలే. అంతేకాక కావ్య మాతృకలకు దండాన్వయ ప్రాయంగా కూడా ఉండేవి.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో ఇంగ్లీషు భాషా సాహిత్యాల పరిచయంతో కాని భారతీయ భాషలలో ఆధునిక ప్రక్రియల ఉద్భవ వికాసాలకు ప్రేరణ కలగలేదు. విశ్వవిద్యాలయాల స్థాపనతో భారతదేశంలో ఇంగ్లీషు భాషా సాహిత్యాల అధ్యయనం కూడా మొదలైంది: నవల, కథ, నాటకం, జీవిత చరిత్ర, కవుల చరిత్ర, సాహిత్య విమర్శ, పత్రికా ప్రకటనం, బాల సాహిత్యం, తెలుగులో కొత్తతరం వారికి ఎంతో ఆసక్తిజనకాలైనాయి. ఇవన్నీ పద్దెనిమిది వందల డెభ్భైల తర్వాతనే తెలుగులో వచ్చాయి. అప్పటికి వీరేశలింగానికి ఇరవై రెండేళ్ళు. ఆయన పత్రికా సంపాదకత్వం వహించేనాటికి ఆయనకు ఇరవై ఆరేళ్ళు. తెలుగు వాళ్ళ వివేకవర్ధనంకోసం ఆయన ఎంతగానో ఆరాటం చెందాడు. అది ఆయన జరిపిన

ఎన్నో సాంఘిక పోరాటాలకు దారితీసింది. సుమారు 20 సం॥ల పాటు ఆయన వివేకవర్ధనిని నడిపాడు. పత్రికా నిర్వహణం అనగానే పాఠకులను ఆకట్టుకోవడానికి ఎన్నెన్నో కొత్త రచనలు కావాల్సి ఉంటుంది. ప్రక్రియా వైవిధ్యం కావల్సి ఉంటుంది. కేవలం పాఠకుల ఉల్లాసం కోసమూ, వినోదం కోసమూ పత్రికలు నడపలేదు వీరేశలింగం. సంఘం చైతన్యవంతం కావాలనీ, వ్యక్తులలో మనోవికాసం కలగాలనీ ఆయన ప్రత్యహమూ మథన పడుతూ తన సాహిత్య కృషిని సాగించాడు. ఆయన ఏ పత్రిక నడిపినా సాంఘిక వికాసాన్నే ఆదర్శంగా వాంఛించాడు. నాటి సాంఘిక పరిస్థితులకు ఆయన ఎంతగానో కలత చెందాడు. అయినా తన నిశ్చయాన్ని విడిచిపెట్టలేదు.

## ఆనాటి సాంఘిక పరిస్థితులెట్లా ఉండేవి ?

ప్రజలలో విద్యావంతుల శాతం చాలా తక్కువగా ఉండేది. స్త్రీలలో చదువుకున్నవాళ్ళు నూటికి ఒక్కరు కూడా ఉండేవారు కాదని అప్పటి జనాభా లెక్కలు చెబుతున్నాయి. సంఘంలో బాల్యవివాహాలు, వృద్ధ వివాహాలు చాలా ప్రాచుర్యం పొంది ఉండేవి. సాంఘికమైన భద్రతను, కుటుంబ జీవన సౌఖ్యాన్ని భగ్నం చేసే వేశ్యా వృత్తి ప్రబలంగా సాగుతుండేది. ఇదేమిటని ప్రశ్నించాలన్న ఆలోచన కూడా ఎవరికీ వచ్చేది కాదు. అదీకాక వేశ్యల నుంచుకోవడం ఒక సాంఘిక హెూదాగానూ, కళాపోషణంగాను, రాసిక్యానికి గుర్తుగానూ చెలామణి అయ్యేది. ఉద్యోగస్థులలో లంచగొండితనం సర్వ సామాన్యంగా అమలులో ఉండేది. ఇంటింటికీ వితంతువులుండేవారు. అదిన్నీ దయనీయమైన, హృదయ విదారకమైన బాల వితంతువులు వాళ్ళు. 1881 జనాభా లెక్కలను బట్టి దేశంలో ఏడాది వయస్సునే వితంతువులైన వాళ్ళు ఎనిమిది వందల దాకా తేలారని బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారొక సభలో చెప్పారు. హిందూ సమాజంలో స్త్రీ జనాభాలో ప్రతి ఆరుగురిలో ఒకరు వితంతువుగా ఉండేవారని రఘుపతి వారే చెప్పారు. గురజాడ అప్పారావు కన్యాశుల్కం పీఠికలో ఈ విషయాన్నే ప్రస్తావించాడు. మూడు సంవత్సరాల కాలంలో కన్యాశుల్క వివాహాలు వెయ్యికి మించి నమోదైన విషయం తన 'సర్వే'లో బయటపడినట్లు ఆయన పేర్కొంటూ ఏడాది రెండేళ్ళలోపు పిల్లలకు కూడా శుల్కం చెల్లించిన ఉదంతాలున్నాయన్నారు. కడుపులో ఉన్న బిడ్డకు కూడా ముందే బయానా చెల్లించిన సంఘటనలు కూడ తమ పరిశీలనలో

వమోదైనట్లు ఆయన చెప్పారు. ఇక ఇంత లేత వయస్సున్న ఆడపిల్లలకు పెళ్ళి చేస్తే అదిన్నీ మధ్యవయస్కులకూ, ముసలివాళ్ళకూ ఇచ్చి పెళ్ళి చేస్తే ఆ సంఘంలో వితంతువుల సమస్యకు కొదువ ఏముంటుంది ? అందుకనే అప్పారావు ఆనాటి భయంకరమైన సాంఘిక దుస్థితిని వివరిస్తూ " such a scandalous state of things is a disgrace to society" అన్నారు.

వీరేశలింగంపంతులు ఈ పరిస్థితులన్నీ ఎదుర్కోవలసి వచ్చింది. "ఎక్కడ ఏ అక్రమము జూచినను నాది సహించి యూరకుండెడి స్వభావము కాదు. ఆయక్రమమునకు ప్రతిక్రియ జూచువరకును నామనస్సున కూరట కలుగదు" అని స్వీయ చరిత్రలో ఆయనే చెప్పుకున్నారు పదే పదే.

ఆయనకు ఇరవై సంవత్సరాల వయస్సు వచ్చేనాటికి సంఘంలో మూఢవిశ్వాసాలెన్నో తాండవిస్తున్నాయి. భూతవైద్యం, మంత్ర తంత్రాలు, వశ్యౌషధాలు, స్వర్ణవిద్య భ్రమలు, చాదస్తపు ఆచారాలు, మధ్యతరగతి డంబాలు, పెద్దమనుషుల వేశ్యాలంపటత్వం ఆయనకు దుస్సహంగా కనిపించాయి. దీనంతటికీ మూలం స్త్రీలు విద్యావంతురాండ్రు కాకపోవడమేనని ఆయన గ్రహించాడు. "స్త్రీలు విద్యావంతులు కానంతవరకు మనదేశము బాగుపడదు. మనయభివృద్ధి యంతయు స్త్రీల యభివృద్ధిలోనే యున్నది " అనే గట్టి నిర్ణయానికి వచ్చారాయన.

ఒక వైపున సంఘ సంస్కరణ కృషి సాగిస్తూనే మరొక వైపున తెలుగు సాహిత్యాన్ని ఆధునికమూ, సుసంపన్నమూ చేసే కృషికి కూడా ఆయన పూనుకున్నాడు.

సంఘాన్ని తట్టి లేపాలంటే, సాంఘికులు తమ దుర్వర్తనకు సిగ్గుపడి తలవంచుకుని నవ్వుకుని తమ ప్రవర్తనను మార్చుకోవాలని నిర్ణయించుకోవటానికి అధిక్షేపం పనికి వచ్చినంతగా తక్కిన యే మార్గమూ అంత ప్రభావశీలంగా ఉపకరించదు. ముఖమల్ చడావుతో కొట్టినట్లు, మెత్త మెత్తగా తల వాయగొట్టినట్లు అధిక్షేపం ఉపయోగపడుతుంది. తెలుగు సాహిత్యంలో అధిక్షేపాన్ని అత్యంత బలమైన సాధనంగా ఉపయోగించుకొన్న గొప్ప రచయితలలో ఆద్యుడు వీరేశలింగం పంతులు. అధిక్షేప రచనలు చేయడంలో ఆయన మహా ప్రతిభావంతుడూ అగ్రగణ్యుడున్నూ.

స్త్రీలు విద్యావంతురాండ్రు కావడమే మహాపరాధంగా పరిగణించే నీతివాదులూ,

ఛాందసులూ, పాతకాలపు ప్రజ్ఞావంతులూ ఉన్న ఆకాలంలో స్త్రీ విద్యకోసనే సాహిత్యోద్యమం నిర్వహించవలసి వస్తే తక్కిన మూఢాచార పరులతో స్వార్థపూరిత దంభ ప్రయోజన పరాయణులతో ఎదుర్కొని పోరుసాగించటం ఎంత సాహసమో, కష్టసాధ్యమో, ఆలోచించవచ్చు.

సంఘంలో నవీన భావాలను ఆక్షేపించినట్లే సాహిత్యంలోనూ నవీన ధోరణులను తప్పుపట్టే పండితులుండేవారు ఆరోజుల్లో. మౌలికత, ఉపజ్ఞాశీలత నశించి గతాను గతికత్వమే సంప్రదాయంగానూ, పాండిత్యంగానూ చెలామణి అవుతున్న రోజుల్లో సాహిత్య ప్రయోజనం సంఘ వికాసానికే అని వీరేశలింగం తనదైన ప్రత్యేక మార్గం, ప్రత్యేక శైలి రూపించుకోవలసి వచ్చింది. నిరూపించుకోవలసీ వచ్చింది.

తెలుగులో సాంఘిక ప్రయోజన శీలమైన అధిక్షేపానికి వరవడి దిద్దినవాడు వీరేశలింగమే. అధిక్షేపం అనే సంస్కృత పదానికి ఎత్తిపొడుపు అనేది చక్కటి తెలుగు మాట. వ్యంగ్యం, పరిహాసం, అవహేళన, వేళాకోళం, వెటకారం, పరిహాసం, పరియాచకం అన్నీ అధిక్షేపం ఛాయలే. వీరేశలింగం అధిక్షేపం పట్ల ఆకృష్టుడు కావటానికి అవకాశం ఎలా వచ్చిందంటే కొక్కొండ వేంకట రత్నం పంతులుగారి వంటి పూర్వ నాగరకాగ్రగణ్యులవల్లా, సంప్రదాయాభినివేశపరుల వల్లా కలిగింది. స్త్రీ విద్యను గూర్చి, పత్రికా రచనలో ప్రవేశపెట్ట వలసిన భాషా సారళ్యం గురించీ, సంఘంలో రావలసిన ఇతర మార్పులను గురించీ వీరేశలింగానికి ప్రబల ప్రతిస్పర్ధి కొక్కొండవారు. ఆయన 'ఆంధ్రభాషా సంజీవని' అనే పత్రికను నడుపుతుండేవాడు. ఆయన గొప్ప పండితుడే. గొప్ప కవే. అందుకేమీ సందేహం లేదు. అయితే అన్నిటా పూర్వాచార పరాయణుడు. మార్పు నొల్లనివాడు. అందువల్ల వీరేశలింగం పంతులుగారి భావాలను వెక్కిరించటానికి తన పత్రికకు అనుబంధంగా 'హాస్యవర్ధని' అనే పత్రిక ప్రారంభించాడు. పేరులోనే 'వివేక వర్ధని' వెక్కిరింపు నాశించాడు వేంకటరత్నం పంతులు. అంతేకాదు వివేకవర్ధని పత్రికను చివరనుంచి వెనుక్కి చదువుతూ 'నిర్ధవకవేవి' అంటే మగడు పోయిన స్త్రీ తల మీద వెంట్రుకలు ఎక్కడివి? బోడిగుండు తప్ప. అని చమత్కరించే వాడుట. ఎప్పుడైతే తన పత్రిక వివేకవర్ధనిని వెక్కిరించటానికి కొక్కొండ వారు దిగజారారో వీరేశలింగం కూడా ఆంధ్రభాషా సంజీవనిని వేళాకోళం చెయ్యడానికి తాను తన పత్రికకు అనుబంధంగా ఒక పత్రిక మొదలు పెట్టాడు. తన పత్రిక ప్రారంభించే నాటికి వీరేశలింగం వయస్సు

ఇరవై ఆరేళ్ళే. ఆయనకు ఆవేశం కలగడం సహజం. రోషం రావడంలో తప్పులేదు. అప్పుడాయన కొక్కొండవారి భాషా సంజీవనిని అపహాస్యం చెయ్యాలని 'హాస్య సంజీవని' అనే పత్రికను ప్రారంభించాడు. ఇదంతా వీరేశలింగం పంతులు గారు స్వీయచరిత్రలో చెప్పుకొనే చెప్పుకున్నారు. కొక్కొండ వారు 'స్త్రీలకు విద్యకూడదు' అని హాస్యవర్ధినిలో ప్రకటించగానే వీరేశలింగం పంతులుగారు 'పురుషులకు విద్య కూడదు' అని తన పత్రికలో ఎత్తుకునే వారు. అంతేకాక హాస్య సంజీవనిలో 'కోదుభాషా సంజీవని' అని ప్రత్యేకించి ఒక విభాగం కూడా ప్రచురించేవారు. కోదులు, గిరిజనులు, వనజనులు. వాళ్ళంతా బతకటం లేదా మనమూ అలా అడవుల్లోకి వెళ్ళిపోయి నిరాక్షేపణీయంగా బతకగూడదా అని వెటకారం.

ఈ విధంగా హాస్యసంజీవనిలో వెలువరించాల్సిన నిమిత్తమే వీరేశలింగం పంతులుగారు బ్రాహ్మ వివాహం, వ్యవహార ధర్మబోధిని వంటి ప్రహసనాలు వ్రాశారు. 1876 జూలైలో వెలువడ్డ మొట్టమొదటి సంచికలోనే 'అభాగ్యోపాఖ్యానం' ప్రారంభించారు. ఇంకా హాస్య సంభాషణ పేరిట ఎన్నో చిన్నచిన్న సన్నివేశాలు హాస్య సంజీవనిలో ప్రచురించేవారాయన. ఈవిధంగా ప్రహసనానికి హాస్యసంజీవని పర్యాయపదమైంది. వీరేశలింగం తన ప్రహసనాలన్నిటినీ హాస్యసంజీవనుల పేరిటనే మూడు భాగాలుగా ప్రకటించాడు. ఇవి దగ్గర దగ్గర నూరుదాకా ఉంటాయి.

హాస్యరచనలు చేయడంలో వీరేశలింగం తనతర్వాత రచయితలకు మార్గదర్శకుడైనాడు. నిజానికి కన్యాశుల్కం పై కూడా వీరేశలింగం ప్రహసనాల ప్రభావం ఎంతగానో కనపడుతుంది. ఎన్నోసంభాషణలు, సన్నివేశాలు, చమత్కారాలు, వాడుపులు గురజాడ కన్యాశుల్కంలో వీరేశలింగం ప్రహసనాల ననుసరించినవి చూపవచ్చు. ఒక చిన్న ఉదాహరణ. ధూమపాన ఉత్కృష్టతను గూర్చి గిరీశంగారు వర్ణించిన "ఖగపతి యమృతముతేగా" అనేపద్యానికి వీరేశలింగంపంతులు గారి కలిపురుషశనైశ్చరవిలాసంలోని 'పొగచుట్టకు సతిమోవికి' అనే పద్యంమాతృక.ఇలా చాలా సన్నివేశగత సంభాషణలు చూపవచ్చు. అదలా ఉంచుదాం.

'అభాగ్యోపాఖ్యానం' రచించడానికి ఆయనకు ప్రేరణకలగజేసిన అంశం ఏమంటే గతానుగతికమైన ప్రబంధవర్ణనలు. ఏప్రబంధం చూసినా కవి స్వీయోపజ్ఞత అనేది ఏమీలేకుండా పురచాతుర్వర్ణ్యవర్ణనందగ్గర నుంచీ, రాజుగారు వేటకు రావడం, ఏ రాచకూతురునో చూడటం, మోహించడం, విరహబాధ, శైత్యోపచారాలు, నాయికా

నాయకులు తమ ఇష్టసఖులతో ప్రలాపించడం, తర్వాత వారి వలపు సాఫల్యం పొందే ఘట్టంలో అనుచిత శృంగారోల్బణం –ఒకే విధంగా సాగడంతో వీరేశలింగం పంతులు గారు ఈ ధోరణిని వెటకారం చేసే ఉద్దేశంతో ఈ అభాగ్యోపాఖ్యాన రచనకు పూనుకున్నారు. అభాగ్యోపాఖ్యానంలోని ప్రతి పద్యం కూడా ఇంచుమించుగా ప్రసిద్ధ ప్రబంధాల పద్యాలకు వికటానుకరణమే.

'శృంగార ప్రబంధములు చేయు మేలు కంటె కీడెక్కువగా నుండునన్న భావమునకు వచ్చిన వాడనగుటచేత ప్రబంధ ప్రణేతృ పంథను పరిహసింపవలెనన్న యుద్దేశ్యముతో నభాగ్యోపాఖ్యానమును చేసితిని.' అని పంతులుగారు స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. అంటే కవుల చరిత్ర రచనా విషయంలో పంతులుగారాయా ప్రబంధా లన్నింటినీ చదవవలసి వచ్చి ఇలాటి రచన చేయాలన్న ఉద్దేశం కలిగిందేమోననుకోవ ఢానికి ఆస్కారం ఉంది. కాని కవుల చరిత్ర రచనకు పూనుకోవటానికి పదేళ్ళముందే అభాగ్యోపాఖ్యానం రచించారు పంతులుగారు. ఆయన పాఠశాల నాలుగో తరగతి చదువుతున్నప్పుడే 'వసుచరిత్ర' చదవటానికి అమితమైన ఉత్కంఠ చూపినట్లు స్వీయచరిత్రలో నమోదై ఉంది. ఏమైనా అభాగ్యోపాఖ్యానం ఆసాంతం నవ్వు పుట్టించే రచన. నాయకుడు అభాగ్యుడు. ఊరిపేరు వ్యాఘ్రాఖ్య పట్టణం. నాయిక ఖరవాణి. ఇది ఏకాశ్వాస ప్రబంధం. చంపూ రచన. ఇందులోని వచనం కూడా చాలా నవ్వు తెప్పిస్తుంది. ప్రబంధ రచనకు అద్భుతమైన 'పేరడీ' ఈ అభాగ్యోపాఖ్యానం. విరహోత్కంఠతను భరించలేకనో, ప్రతి నాయకుడి తాడనల వల్లనో నాయకుడు చచ్చి సున్నమై పోయినట్లు వర్ణించటం పంతులుగారి వెటకార తీవ్రతను ధ్వనింపచేస్తుంది. అభాగ్యోపాఖ్యానం నూటా పదహారు గద్యపద్యాల రచన. రాజుగారు వేటకు వెడలినప్పటి పుర సుందరీమణుల 'కనువేదురు' కడుపుబ్బ నవ్విస్తుంది.

'సరస్వతీ నారద విలాపం' ప్రశస్తమైన అధిక్షేప రచన. వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్ర రచనకుపక్రమించినప్పుడు అర్వాచీన కవులు ఉపజ్ఞను నిర్లక్ష్యం చేసి సాహిత్యపరమైన దొమ్మరి విద్యను ప్రదర్శించటం, పద్యంలో పద్యం, పాదంలో పాదం దూర్చడం వారి ఏకాక్షర నిఘంటు పాండిత్యం, ఆశుగర్భ చిత్రకవితల క్రీడలు, ఆయనకు మెప్పు కలిగించక పోగా వెగటు కలిగించాయి. దేవుడిచ్చిన కాళ్ళతో నడవకుండా పొట్టతో దేకడంలాగా ఉంది ఈ పాండిత్య ప్రదర్శన అని ఆయన ఈసడించుకున్నాడు. మౌలికమైన సృజనాత్మకమైన, ప్రతిభ తగ్గిపోయినప్పుడు

ఇటువంటి విపరీతాలు సంభవిస్తాయని ఆయన వేళాకోళం చేసిన రచనే 'సరస్వతీ నారద విలాపం'. రానురాను సాహిత్యం సాముగరిడీల వాళ్ళ పాలైందనీ, సంగీతం సానివాళ్ళ పాలైందనీ తల్లీ కొడుకులు ఒకచోట తారసపడి అంటే సరస్వతీదేవీ, నారదుడూ అనుకోకుండా ఒక అరణ్యంలో తారసపడి ఆక్రందించే అధిక్షేప రచన ఈ సరస్వతీ నారద విలాపం. 'నన్ను పూర్తిగా విరూపిని చేసి శవప్రాయను చేశారు' అని తనగోడు వెళ్ళబోసుకుంటుంది చదువుల తల్లి. 'నా కష్టం ఏమని చెప్పనమ్మా సంగీతమంటే సానివాడలను మాత్రమే ఆశ్రయించాల్సి వచ్చిన దుర్గతికి చేరుకున్నది' అని నారదుడు విలపిస్తాడు. తమ కష్టాలు చెప్పుకొని తల్లీ కొడుకులు దుఃఖించే సన్నివేశం సృష్టించి ఇరవై పద్యాలలో ఈ అధిక్షేప రచనను నిర్వహించారు పంతులుగారు. కరుణావిలమైన సన్నివేశానికి తగినట్టుగా లలితమైన శైలిలో ఈ విలాపం నిర్వహించారు వీరేశలింగం పంతులుగారు. 'ఛందోబద్ధంబగు పదబృందాటోపంబు తా కవిత్వం బగునే' అనీ ఛందోబద్ధమనే ఏకైక కారణం చేతనే 'బ్రతుకు గననగునేనిన్, తనువది వదిలి, మృతినొందుటయె లెస్స కవితా సతికిన్' అనీ అక్షరాల సాముగరిడీలను నిరసించారు పంతులు గారు.

ఇక సత్యాద్రౌపదీ సంవాదం కూడా ఒకరకమైన అధిక్షేప రచనే. అయితే చాలా మృదువైన అధిక్షేపం కనబడుతుంది ఇందులో. ఆనాటి సంఘంలో అతి బాల్యవివాహాలు, బాల వితంతువుల కడగండ్లు, అసమ వయస్క వివాహాలు-వీటివల్ల వశ్యౌషధాల పట్ల భ్రాంతి ఎక్కువగా ఉండేదేమోననుకోవాలి. అంతేకాక సాని పాపలు విటులైన ధనవంతుల్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకోవడానికీ వారి సంపదనంతా కొల్లగొట్టటానికీ మందులూ, మాకులూ మంత్ర తంత్రాలూ ప్రయోగించటం కూడా ఆరోజుల్లో సాధారణమనుకోవాలి. నిన్న మొన్నటి వరకూ 'మందుబెట్టడం' అనే మాట వినపడుతూనే ఉండేది. ఆనాటి పరిస్థితులకు కంటగించుకొని వీరేశలింగం భారత అరణ్యపర్వంలోని ఒక సన్నివేశాన్ని ఆధారం చేసుకుని 'సత్యాద్రౌపదీ సంవాదాన్ని' రచించి ఉంటారు. 'ప్రేమ ఇచ్చిన ప్రేమ వచ్చును' అని సతీపతుల కాయన ఆనాడే సద్బోధ చేశారు.

ఇక సత్యారాజాచార్యకృత "పత్నీహిత ప్రబోధ నవరత్నమంజరి" స్త్రీల విషయమై పురుషాహంకారపు ప్రపంచాన్ని ఆయన ఎంతగా ఏవగించుకున్నాడో తెలిపే రచన. మహిళావికాసం కోసం ఆయన వకాల్తా పుచ్చుకొని పురుషజాతిపై

ప్రయోగించిన కశాఘాతం ఈ రచన. ఇక్కడ ఈ దేశంలో స్త్రీలు అనుభవిస్తున్న బాధలు, అవమానాలు, అనుమానాలు, పరిభవాలు, నిరసనలు, నిందలు, హింసలు, హీనతలు పురుషుడే అనుభవించాల్సి వచ్చినప్పుడు ఎట్లా ఉంటుంది అనేది ఆయన సూటి ప్రశ్న. ఆయన హాస్య చమత్కార ప్రజ్ఞ, ఈసడింపు ఆ రచనలో వెల్లివిరిసాయి.

శుచి అయిన, రుచి అయిన, ఆరోగ్యకరమైన, ఆహ్లాద సంధాయకమైన, ప్రబోధప్రాగల్భ్యంగల హాస్యం, పరిహాసం, కనుమరుగైపోతున్న ఈ కాలంలో తెలుగు విశ్వవిద్యాలయం వీరేశలింగ మహాశయుడి పరిహాస కుశలతను, పేశలతను ఈతరం వాళ్ళకు జ్ఞాపకం చేయడం అభినందనీయం.

సాంఘిక రుజలపై అమోఘంగా పనిచేసే ఔషధం హాస్యం. అది అధిక్షేప రూపంలో వెలువడినప్పుడు త్వరలోనే, రోగాన్ని రూపుమాపుతుంది.

ఈ అవకాశం నాకు కలగజేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికీ ముఖ్యంగా ఉపాధ్యక్షులు శ్రీ పేర్వారం జగన్నాథం గారికి ఎంతైనా కృతజ్ఞుణ్ణి.

అక్కిరాజు రమాపతిరావు

వీరేశలింగం 145 వ జయంతి
16-4-1993
హైదరాబాదు

# విషయసూచిక

# సరస్వతీ నారద విలాపము

## రంగము – దండకారణ్యము

(వీణలువార్చి దుఃఖించుచు సరస్వతీ నారదులు వేరువేరుగా ప్రవేశించు చున్నారు.)

సర – (నిట్టూర్పు విడిచి తనలో)

క. ఈ పాపుల కతమున నా
రూపెల్లను మారిపోయె; గ్రూరాత్ములకున్
జేపడితి; మోసపోయితి;
నే పగిదిం బ్రతుకుగందునిక నేనకటా?

క. దాయ లలంకార మిషన్
గాయం బాపాదమస్తకంబును బొడువన్
గాయపడి మామకాంగ ని
కాయము నొచ్చెదును దేలు కరిచిన భంగిన్
(అని విలపించుచున్నది)

నార – (తనలో)

క. కటకట! సంగీతంబున
కెటువంటి యవస్థ పట్టె నీదేశములో!
పటుతర మోదంబెవరికి
ఘటియింపదు నేడు నాదు గానంబుర్విన్

క. కటువులె యీ హరికీర్తన
లటమటమున విటుల కొక్క యరకాసునకున్
దటుకున మానమె యమ్మెడు
కుటిలాలక లరచు బూతుకూతల కంటెన్?

(ఆలకించి)

గీ. వినబడెడు స్త్రీ విలాపమీ విపినమందు!
అహహ! యెవ్వరి దొక్కొయీ యార్తరవము
శ్రావ్యతరమయ్యెడును గానరసముకంటె
ఎవ్వరయి యుందు రొంటినిట్లేడ్చువారు ?

(ముందువంక జూచి)

ఉ. అక్కట! యామె మజ్జననియైన సరస్వతి యట్లయున్నదే !
తక్కరులైన నిమ్మధురతా గుణముండునె రోదనధ్వనిన్ ?
చక్కని పాటకున్ సొగసి సర్పమదే మెడచుట్టియాడెడున్
గ్రక్కునబోయి నేనడిగి కన్గొనువాడ విచార హేతువున్

(చేరువకు బోయి)

క. ఓ తల్లీ ! యిద్దెయొక్కెద
నీ తనయుడ నారదుండ; నిక్కము చెపుమా
చేతోవ్యథతో నీకిటు
నా తల్లి యరణ్యరోదనం బేమిటికిన్ ?

సర – (తల యెత్తి చూచి)

క. తనయా ! నావలెనే యీ
వనమున కీవిప్పుడేల వచ్చితివయ్యా ?
నినునిట గనినంతనె నా
మనమునగల కలత కొంత మానెంజుమ్మీ

క. నారోదనమునకుంగల
కారణమడిగితివి గాన తెరగెల్లన్
గూరిమి పుత్రుడ వౌటను
గారవమున దెల్పుదాన ఘనమతి వినుమా

మ. రమణీయోక్తులచేత నర్థగుణ
సారస్యంబు గల్పించుచుం
దమి నాయంగ చయంబునన్
సహజ సౌందర్యంబు పెంపొంద గాం
చెమలంకారములుంచి తొల్లిటి కవుల్
చేష్టా చమత్కార భా
గ్యము హెచ్చించుచు
దీర్ఘకాలము నమం గాపాడి రర్థక్రియన్

చ. అటు సుఖియింపు చుండగ మదాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడు శబ్దముల బల్మినిబెట్టి, రసంబు నెట్టి య
క్కటికము లేకలంకరణకైతవముంగొని మేనుకుట్టి, యి
ప్పటి ఘనులార్తి పెట్టెదరు ప్రాణము తీసి నమం గలంచుచున్

క. తెలియదు నుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్;
వెలభూషలు గాకివినం
కెలలయి కడు నాదు మేనికిన్ వెత నించున్

నార –

క. ఓహో ! యెటు చెరిచిరి నీ
దేహము చెలువెల్ల జడులు తెక్కలి నగలన్ !
దేహరుచి గవ్వపేరుల
బాహుల పూసల సుకారి భామలు పోలెన్

క. సుందర బహురసపుష్టి నమందానందంబు బుధుల మదికిడదేనిన్
ఛందోబద్ధంబగు పద బృందాటోపంబు తాకవిత్వంబగునే

క. రసములు కావే ప్రాణము ల నమాన కవిత్వకాంత కవనీ స్థలిలో
రసహీనమైన కవితకు బొనగించు నలంకృతి శవమునకిడు తొడవౌ

క. విను ఛందోబద్ధంబను
ఘనకారణముననె బ్రతుకు గననగుననెన్
తనువది వదలి వెనం జ
క్కని మృతినొందుటయె లెస్స కవితా సతికిన్

క. కవితాసతి జీవకళన్, శ్రవణోత్సవ భాషణంబు సలిపెడు నల్లుం
డవలెంగాక యొకప్పుడు, శవము వలె న్నిద్రిత వలె జనదుండంగన్

నర –

క. అవునది నిజమే యైనను
భువిలో ప్రాణంబులేని బొందియె యిపుడీ
నవమేధావుల చేతన్
వివిధంబుగ బొగడబడెడు ! విధినేమందున్ ?

సీ. దయమాలి తుదముట్ట దీలకట్ల నిగిడించి
ధీరుడై నన్ను బాధించునొకడు
పాదంబులోపల పాదంబులిమిడించి
వీరుడై నన్ను నొప్పించునొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లొదవించి
పోటుబంటై నన్ను పొడుచునొకడు
బెండువల్కులు గూర్చి నిండించి నగలంచు
దిట్టయై జెవులు వేధించునొకడు
ఖడ్గచక్రాది రూపముల్ గానిపించి
వర్ణములు మార్చి నను జిక్కువరచునొకడు.
కుమతులొడలెల్లవిరిచి ప్రాణములుతీయ
నొడలి పసలేక శుష్కించి యున్నదాన

శా. ప్రాణంబుల్కడబట్టియుంట తెలియన్ రావెందు మద్వాక్యముల్
త్రాణల్పాయుట మారి యెవ్వరికి బోల్పన్రాదు మద్రూపమున్

ప్రాణాపాయము కల్గకుండ నెట్లకైనన్ నన్ను గొంపోయి సం
త్రాణంబీవానరింపుమింతటను బుత్రా మాతృరక్షార్థివై.

గీ. అన్న, నీమోమునను దోచె విన్నదనము
కారణంబేమి నీదు దుఃఖంబునకును
పద్మవదనమున రాదుగా వార్ధకంబు
నాకుబోలెను నీకును? నోకుమార

నార —

క. అమ్మాయేమనిచెప్పుదు?
నిమ్మహి నామోము చూడ రిపుడెవ్వారున్,
నమ్మము వేశ్యల మాటలె
కమ్మలు సుమ్మా రసికుల కర్ణంబులకున్

క. భగవన్నామా మృతమే
వెగటయ్యెను భక్తిపరులవీనులకెల్లన్
జగమున నిపుడొక పడుపు
న్మగువ పదంబె యమృతోపమానంబయ్యెన్

గీ. ఇట్టి దురవస్థ జూచి యెందేని బోవ
దలచి వచ్చితి హృదయ ఖేదంబు తోడ
జనని! సంగీత సాహితుల్ కనులు నీకు;
భరత ఖండంబునను రెంటి పొరలు గ్రమ్మె

గీ. పాట యెల్లను వెలయాండ్ర పాలుచేసి
జనని! తలమున్కదుః ఖాబ్ధిమునిగియున్న
తల్లి వాంఛ దీర్చుట పుత్రధర్మమగుట
వీపునను మోచికొని పోదు వేగరమ్మ

(ఇద్దరు నిష్క్రమించు చున్నారు.)

# అభాగ్యోపాఖ్యానము

## హాస్యప్రబంధము

క. శ్రీరమణీహృల్లోలా! కారుణ్య లతాలవాల కాంచనచేలా
ఘోరావహజయశీలా! శ్రీరాజమహేంద్ర వరపురీ గోపాలా! 1

వ. భవదీయ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత సరస కవిత్వపటుత్వంబు బెంపున నే కల్పింపంబూనిన హాస్యరస ప్రధానంబగు నభాగ్యోపాఖ్యానంబునకు కథా క్రమం బెట్టి దనిన 2

క. అడవులలో గడు నిడుములు
గుడుచుచు ధర్మాత్మజుండు కొందలపడగన్
వడి పరిహాసకు డ
య్యెడకు జనుదెంచి మ్రొక్కి యీ కథ చెప్పెన్ 3

గీ. వింధ్యధాత్రీధర ప్రాంత వంధ్య భూమి
జలము లేనట్టి యొక పాడుకొలను దరిని
దండకారణ్య మధ్యంబు దనరజేయు
పావనదనంబు వ్యాఘ్రాఖ్య పట్టణంబు 4

క. ఆపురము లచ్చియవ్వకు
గాపురము జగంబులందు గల పురములలో
కాపురము పాపసమితికి
దాపురము మహోపుర మల దానవతతికిన్ 5

క. అన్నగరంబున గరమ
భ్యున్నతి వహియించు కుజనపుంగవ కోటి
ల్యోన్నతి కోడుటగాదే
పన్నగకుల మెల్ల జేరె పాతాళంబున్ 6

సీ. వెలయాలి యింటనె విడియుండి దానిచే
తిట్లు తన్నులు రోజు దినెడివారు
చిక్కిపోయిననాడు దానింటనే యుండి
పని యున్నదిదె వత్తుననెడివారు
కన్నెరికము చేయు కార్యంబునకు పూర్వ
ర్జించు మాన్యమ్ము లమ్మువారు
భోగకాంతలు గాక పొరుగు వారల భార్య
లను జేరి సౌఖ్యంబు గనెడువారు
విలువ సారాయి పీపాల కొలది ద్రావి
యొడలు తెలియక వీధుల బడెడు వారు
నగుచు మర్యాదలను గాంతు రనవరతము
బ్రాహ్మణోత్తము లా దివ్య పట్టణమున 7

చ. కురుబలముం గనుంగొనుచు కోటి తురంగ జవంబు తోడ ను
త్తరు డరదంబుడిగ్గి పురితట్టున బారియు క్రీడి ప్రేరణన్
మరలగ పోరికేగుటకు నవ్వుచు నుందురు పోటుబంటులై
పిరికితనంబునం బురిని పేరు వహించిన రాజపుంగవుల్ 8

గీ. బియ్యమున వడ్లు బెడ్డలు పెక్కుఁగలిపి
నేతిలో నంటి పండ్లను నెరయ బిసికి
తప్పు తూనిక తూచుచు దక్కుఁవగను
గొలుచుచును గోమటులు సొమ్ము గూర్చుకొంద్రు 9

గీ. కూట సాక్ష్యంబు బ్రాహ్మణ గురుల వలన
బాగుగా నేర్చుకొని పాటుపడుట మరచి
జూదముల దొంగతనముల శూరులగుచు
శోభగాంతురు పురిలోన శూద్రజనులు 10

చ. తన వలుముండ్ల వాడిమిని దప్పక వాసవు వజ్రమున్ జయిం
ప నతి దృఢంపు మట్టలను మైమఱువొప్పఁగ నేగి ముండ్లచే
నని గుఱిశంబు గెల్చి తనకడ్డగు వేల్పుల కందలొల్చి తా
నొనరె ననంగ బ్రహ్మజెముడొప్పుగ నెర్రని పండ్ల గుంపులోన్ 11

చ. పురిదగు జుట్టునుంగదిసి భూరి భయంకర కీల పట్టుమై
పెరిగిన గచ్చపైన్ బొదలు పెట్టని కోటగ లోని యాల చాల్
బురుజులు గాగ దాపునను బొల్చిన తుమ్మలు పెద్దముండ్లతో
నురియలు దూసి సద్భటులు స్రుక్కక కావలిగాచు తీరుగాన్ 12

సీ. మార్దవం బన్యాయమార్గ వాక్కుల యంద
సాహసం బాహార సమయమంద
ప్రజ్ఞయంతయును దంభములు కొట్టుట యంద
యంద బంటు తనము వంటయింటి
మితభాషణము శాస్త్రతతుల చర్చల యంద
కలిమి పురంధ్రుల కౌనులంద
నిలుకడ నెలతుల నేత్రయుగ్మమునంద
ధైర్యంబు పెద్దల తరుముటంద
వడి లతాంగుల వంకర నడలయంద
శాంతి యెంతయు దుష్కర్మ సహనమంద
కాని మరి యెందు వెదకిన గానరా ద
నంగ దద్దయు నాపట్టణము వెలుంగు 13

గీ. తివిరి పాపపుంజంబు మూర్తీభవించి
వచ్చి గుమిగూడి ప్రోల్చొరబారు కరణి
వంది గున్నలు చెరలాడు సందులందు
దున్నపోతులకై వడి చెన్నుమీరి 14

తే. వేసవిన్ బడు వెంబడిన్ వేడి నిప్పు
గాడుపెన్ బయవెళ్ల రానిపొమ్ము
పయిపేరిన చేలసమూహంబు లోడ
పాడి యూరికె మానవకోటి నెపుడు 15

ఆ. చలి గప్పిన మైలుక కోటిలోడ
నిలిచి ప్రాకారాన్ నేరక నిలుపొచ్చు
వెలిగె రాచేటి గుంపులు వేయునేల
పురిని బుట్టిన సుక్షేత్ర పుట్టి పోవు 16

చ. మనుజాలు మద్యులం దునిమి తత్తను మాంసము మెక్కి పోవగా
వెనసి పురంబు నల్గడల నెమ్ముల రాసులు భూధరంబు ల
ట్లనుపమ లీలనుండ భ్రమభావళితోడ మనోజవైరి యా
మనికికి వెండికొండయని మాటికి వచ్చు బరిభ్రమించుచున్ 17

ఉ. కొంపలమీది తుక్కెగర గొట్టుకు పోవగ తూముకాల్వలో
కంపును గూడి తోటలను గప్పిన కుక్క పొగాకు చెట్ల బల్
గుంపుల వాసనం గలిగి కుప్పలు నిప్పులరాల వేడిలో
ముంపుచు వాయువుల్ పొలయు ముక్కున వెంద్రుకలెల్ల మాడగన్ 18

ఉ. అంగనలూర మెల్లజనునప్పుడు కూడెదమంచు లేళ్ళు జి
వ్వంగులు జేరి యోలువడువారిని గెల్చిన వారుప్రమింగగా
పొంగుచు బన్నిదంబడచి పోవగ జాలక లేదులోడె చి
వ్వంగులు గెల్చ గానియెడ వానికి లేళ్ళను జంపనేటికిన్ 19

ఉ. ఆ పురమేలు రాక్షస మహోకుల వారిధి బాడబుండు, కా
శీపురనాథ విష్ణు సరసీరుహ సంభవ పాదభక్త సం
తాపకరుండు, పుణ్యవసుధాధర వజ్రధరుండు ప్రోల్ల స
త్పాపధనంజయాబిలుడు దానవుడొక్కడభాగ్యనాముడై 20

సీ. వాని దుష్ప్రవృత్తిలో వాసి చెందగ జూచి
కుందుచు పీకల్లు గుహల నడగె
వానిపై దిగిలోడ వాదులాడగ జూచి
ఖడ్గమృగంబులు కానడాగె
వాని చాపలములో బ్రతిబొందగా జూచి
వానర జాలంబు వనము దూరె
వాని మాంద్యములో సమానంబు రాజూచి
దున్నలు బురదలో దొర్ల దొడగె
వాని క్రౌర్యంబులో దినుసూనజూచి
జడిసి వ్యాఘ్రంబు లడవిలో సంచరించె
వాని కంఠ స్వరంబులో వాదుపూని
పొరలె గార్దభ బృందంబు బూదిలోన 21

క. విరతము శంభుని పూజలు
కరమొనరుచుచుండు పక్షికంఠుడు సరియే
పరమాధమ గుణుడగు నీ
హరదూషణ పరున కవని వ్యభిచారమునన్ 22

క. వదలక వారల సమ్మతి
ముదమున దినమొకని బకుడు పాలియించెను వీ
డదరక బలవంతంబుగ
బదుగుర నూర్వుర దినంబు బట్టి వధించున్ 23

క. ధీ రహితుండై తగియు న
ధీర హితుండై ధరిత్రి దీనత నేలెన్
క్రూరాగ్రేసరుడా విబు
ధారాతి తనదు చరిత్ర మతిచిత్రముగాన్ 24

ఉ. అతనికి బొట్టుకోసినను నక్షర మొక్కటి లేదు; కాగడన్
వెతకిన తెల్విలేదు; దయ వీసమునుం గలనైన లేదు; ప్రో
న్నత నయ విద్యలేదు పదునాల్గు పుటంబులు వెట్టికాల్చినన్;
జతురత వాత పెట్టినను సత్యము జిహ్వకురాదొకప్పుడున్ 25

వ. అతం డొక్క నాడు 26

సీ. ఒక దిక్కునను గుక్కలొక గ్రుక్కగా గూయ
నొక చెంత బలుదుంత లొలసి యార్వ
నొకమూల ఖరజాల మురు లీలనోండ్రింప
నొక చోట గుడిసేటి యువతు లడల
నొకదండ ముదిముండలొక దండుగా గూడ
నొక వంక బలుకుంక లొదిగి యుండ
నొక పొంత గడముంత లొక దొంతరగ నుండ
నొక క్రేవ మధుసేవ లొనర జేయ
పెంట పోగులు జీవుళ్ళు బేడకుప్ప
లలుకు గుడ్డలు గోడి యీ కెలును దనర
దంబు మీరిన శునకాననంబు నందు
కొలువులో చచ్చినట్టులు కూరుచుండె 27

ఉ. ఆగతి గొల్వులోన దనుజాధముడుండి గులాము నొక్కనిన్
వేగమ పిల్చి. వేటపయి వేడుక నాకిపుడుద్భవిల్లె వే
వేగమే వేటకాండ్ర మన వేపుల దోడ్కొని రమ్ము నావుడున్
సాగి యతండు చచ్చిచెడి చాలగ చెప్పిన రీతి జేసినన్ 28

గీ ముడ్డి యెండియున్న మొద్దు గుర్రము మీద
కదల కుండ నెక్కి కాళ్ళు నేల
దగుల గూరుచుండి తక్కిన వారలు
వెనుక జేరి తోల వెడలె నతడు 29

వ. అట్లు మిడి యెండం గాళ్ళు గాల నెత్తిమాడ బురంబు వెడలి 30

చ. మలమున మూగు నీగల క్రమంబున బీనుగు చుట్టు జేరు న
క్కలగతి బుల్లెపై గవియు కాకుల కై వడి వేట కాండ్రు గు
క్కలు సరదాల్లు సెల్లడల గ్రమ్మి రయంబున నేగు దేరగా
వెడలె నతండు కాకములు వేపులు నక్కలు గూయుచుండగన్ 31

వ. అంత 32

చ. దనుజుని జూడ సూక్ష్మతర దారుణనేత్రయొకర్తు ముందుగా
నెనసిన మొండి గోడవయి నెక్కిన ముద్దియయోర్తు వచ్చి తా
వెనుకకు ద్రోచె నందునను వెన్కకు నెమ్మలురాల గూలి మా
నిని వెన మూర్ఛపోయె వడి నెచ్చెలు లేడిచి రొక్కపెట్టునన్ 33

ఉ. వీత శిరోజ యొక్కరిత వే దనుజుం గన గోడ యెక్కి యు
ర్వీతలమందు జారిపడి రింగున దొర్లుచు దైత్యుజేరె ని
ర్భీత మనోజ్ఞయై కలన బీరమునం దను గెల్వజాలు బం
ట్రౌ, తులడించి తన్నుగొని గక్కున బొమ్మని వేడవచ్చెనాన్ 34

ఉ. బాడిద చెట్టు శువ్వకుచభాగ యొకర్తు నరాశనాథమున్
జూడగ నెక్కి దన్మహిజసూనచయం బొగి నెండుకాయలం
గూడి సుపర్వ వైరి పయిగుంపులుగా బడుపెంపు వాల్చె బె
న్వేడిమి మింట దైత్యుపయివేలువులుల్కలు రాల్చి రోయనన్ 35

చ. అటుచని యూరి బైట గలయం జరియించుచు నొక్కతావునన్
బెటుకున ముందుగా చెవులపిల్లిని గన్గొని కుక్క గుంపులన్
బటుమతి దానిపై గవియ బంపగ నవ్వియు నేగి క్రమ్మరన్
దటుకున వచ్చె గాల్లువడి తత్పురి కుక్కల ధైర్యమేమనన్ 36

ఉ. అవ్వల నూరబంది యొకటడ్డము వచ్చిన దద్భటావళుల్
చివ్వకు నీటెలం గొనుచు శీఘ్రమ వర్వెడు పంది వారలన్

దవ్వుల జూచి లో బెదరి దారుణ భంగిని ఘుర్ఘరింపగా
నెవ్వడి బారి రాభటులు నిల్వక దానికి లొంగ కుక్కనన్ 37

గీ. పంది బొడువంగవచ్చిన భటచయంబు
బెండువడి పందితోడనే బెదరి యురికె
శశము బట్టంగ వచ్చిన సారమేయ
వితతి శశకంబుతోడనే వెనుక దిరిగె. 38

వ. ఇట్లు భట శ్వానంబులు బెదరిచెదరిన రాక్షసాధ్యక్షుండు
రూక్ష వీక్షణుండయి కుర్కుర మర్కట మార్జాల శశకాద్య
నేక క్షుద్ర మృగకులంబుల బొలియించి మృగయా వినో
దంబు సలుపుచుండ నొక్కచో నొక తరుక్షువు వీక్షించి
తురంగంబు భయాకులాంతరంగంబయి యికిలిం
చుచు నపరాహ్ణ సమయంబున సరోవర సమీపంబున
బురదనేల నతనిం గూల్వైచి చనిన యనంతరంబ యింత
కుమున్న విట్పరంబుచే దరుమంబడి యచ్చట డాగి
యున్న భృత్యుండొక్కరుండు చనుదెంచి లేవనెత్తిన 39

గీ. బురద తుడిచి కొనుచు బొక్కుచు చనుదెంచి
యతని గ్రుచ్చి యెత్తి యాదరించి
పందిచేత బడక పరచి వచ్చినయట్టి
పౌరుషంబు కొంత ప్రస్తుతించె 40

వ. అట్లు సేదతేరి తీరస్థిత వట మహీరుహచ్ఛాయంజేరి భృత్య
సహితంబుగా నందు విశ్రమించియున్న యవసరంబున 41

చ. శునకము రోదనంబు గతి సూకరనాదము భంగి గార్దభ
స్వనము విధంబునన్ బ్రబల సైరిభరావము పోల్కిదవ్వులన్
వినబడె రాక్షసాధముని వీనుల కెంతయు విందుసేయుచున్
ఘన నినదంబు భూమిధర గహ్వరజాలము మారు మ్రోయగన్ 42

శా. ఆ నాదం బతడాలకించి మదినాహోయంచు భావించి చి
త్తానందంబున భృత్యునిం బిలిచి నీవా చప్పుడే తెంచు సు
స్థానం బారసి వేగమా ధ్వని ప్రభూతం బౌటకుం గారణం
బానందంబున జేరబోయి కని రమ్మా యెవ్వరల్లార్చిరో 43

క. ఆ నాదము విన్నంతనె
మానసమున కెన్నరాని మమత జనించెన్
శ్వాన నినాదమొ యొక ఖర
యాన నినాదంబొ వేగనారసి చెపుమా 44

చ. అన విని భృత్యుడాక్షణమ యానతి గైకొని గట్టుడిగ్గి కా
ళ్ళను బెనుముండ్లు గ్రుచ్చుకొన లాగుచు మ్రొగ్గుచు వేగలేచుచున్
జనిచనిడొంకముండ్ల మెయి సర్వము జీరుకు పోవనోర్చుచున్
బొనువడుచున్న పాడుగుడి పొంతను మొద్దగు చావరాతిపైన్ 45

మ. కనియెన్ దానవదూత సూక్ష్మనయనన్ గాలాంతకాకార ని
ర్ధన జీవన్ ఖరవాణి గీశసమవక్త్రన్ రక్తవర్ణాలకన్
గనదుద్యద్వసుధా ధరాంచిత వలగ్నన్ భూరినీలాధరన్
ఘనదేహన్ లసదుష్ట్రయాన విలసత్కాంతా కదంబాధమన్ 46

చ. కనుగొని దైత్యుచెంగటికి గ్రమ్మర వచ్చి యతండు వల్కెనో
దనుజ కులావతంసమ ముదంబున నీవటు నన్ను బంపగా
ఘనమగు ముండ్లచెట్లనక కంకరరాళ్ళనకెంత దూరమో
చనిచని పాడుదేవళము చక్కెని నేను మహాద్భుతంబుగన్ 47

సీ. పాడలు గ్గిన యట్టి భూరి బాహుయుగంబు
జిగికొండచిల్వల యుగము గాగ
నేత్రాంతముల నుండి నెవ్వడి బరతెంచు
కన్నీళ్ళు సెలయేటి గములు గాగ

గహ్వరరంధ్రములు ఘన వక్త్రబిలమును
రమణీయతర గహ్వరములు గాగ
గాత్రమంతట నిక్కు ఘనరోమ సంఘంబు
ధాత్రీరుహముల బృందంబు గాగ
గురుచలౌ యెఱ్ఱవెంట్రుక గుంపులడరి
యడవి దహియించునట్టి దావాగ్నిగాగ
గొప్ప పర్వతము కరణి గూరుచున్న
పొలతిగంటి పురాకృత పుణ్యమునను 48

వ. తదీయ రూపాతిశయంబులు వివరించెద నాకర్ణింపుము 49

చ. చెడుగుల నేరి యొక్కగుమిచేసి విధాతృడు గార్దభంబులన్
బుడమి సృజింప వాని మెయి భూరి కురూపము చాలమిం బదం
పడి యొనర్చి లొట్టియల వానికి మిక్కిలి కుస్వరంబు చే
వడమి నొనర్చె నేర్పుమెయి భామను రెండును గల్గియుండగన్ 50

చ. పవలును నుండు పెద్దమము పాడుగుణంబులు రూపుదాల్చి యీ
భువనములోన గ్రమ్మరగ బుట్టిన భీకర విగ్రహంబు బాం
ధవ నిచయంబునేచ వసుధాస్థలి గల్గు పిశాచభామ తా
భువి జరియించు సంపదల ముద్దియ యక్కనెలంత యంతయున్ 51

ఉ. చారునగంబులన్, ధనువు, సంపెగపూవును గెంపుగూర్చి సిం
గారపు జన్నులన్, బొమల, ఘ్రాణము, వాతెరజేసి బ్రహ్మ తా
వారక వాని కర్కశత, వంకర, బచ్చన, రక్తకాంతి బెం
పారగదీసి చేసె మెయి, యూరును, గన్నులు, గుంతలంబులున్ 52

చ. ఘనతర మధ్య భారమున గంపమునొందెడు సూచకాళ్ళు పెం
పొనర బిరుందులుం ఘనతనొందిన దాళగలేవటంచు దా
వనరుహగర్భు డెంతయును వంత మదిందలపోసి సూక్ష్మ లో
చనకు బిరుందులు న్మిగుల సైకముగా నొనరించె నేర్పునన్. 53

గీ. కొమ్మగాదది మేటి పెద్దమ్మగాని
బాలగాదది యముచేతి కోలగాని
కన్నెగాదది బలిసిన దున్నగాని
నారి గాదది జనులకు మారిగాని 54

గీ. అట్టి కన్నియయును నీవు నవగి పెనగి
కనరు లేనట్టి మమతల గలసిరేని
యెందు నీతచెట్టు పయి కోరింద తీగె
యల్లుకొను రీతిగాదె యో యమరవైరి 55

చ. అని చెలికాడు తెల్పుటయు నాక్షణమా రజనీచరేంద్రుడున్
మనమున సంతసం బడరమానిని జూడగ మిత్రు వెంట వే
చనియెను ద్రోవలో గలుగు సర్వమహీజ లతా విశేషముల్
గనుగొనుచున్ మృగావళుల గాంచుచు డొంకల ముండ్లు జూచుచున్ 56

చ. కనుగొను సంగడీడ యదె గట్టుకు జేరువ గచ్చతీగ మిం
చినతమి గట్టిగా ముసిడిచెట్టును జుట్టుకయుండె మేలు మేల్
దనుజ కులాగ్రగణ్య విను దారుణలీల గవుంగిలించి యా
వనితయు నట్టులే మిగుల వంతల బెట్టి కలంచు మీదటన్ 57

క. చూడుమదె గార్దభాంగన
తాడన మెనరించె తనదు ధవుని వయస్యా
చేడియ నిన్నును సరసం
బాడెదు నవుడిఁ తన్ను నమరవిరోధీ 58

క. ఇటు లన్యోన్యంబును ము
చ్చట లాడుచు నేగి యేగి చామను గుడిచెం
గటగని మేను వడంకగ
నటమటలో నిర్జరారి యనియెను దనలోన్ 59

ఉ. దీనిని నేను వేడినను దిట్టునొ కొట్టునొ లోనికేగునో
మానిని బల్మి బట్టుటయు మంచిదిగాదని యూరకుండి నే
సూనశరార్తి నెక్కరణి స్రుక్కుదు నే విధినైన నిప్పుడీ
చానను గూడు వాడ నని చప్పుడు సేయక మెల్ల మెల్లగాన్ 60

చ. వెనుకకు వచ్చి చే యొడిసి వేగమ బట్టిన లేచి దానవున్
గనుగొని కొమ్మ తానెడమ కాలున ముందరి పండ్లురాల దా
చిన దగనొర్చి నెచ్చెలియు భీయన వెండియు గౌగిలింప జూ
చిన జెలి భీతి గర్భగుడి చేరెను దల్పులువైచి గొబ్బునన్ 61

ఉ. అంతట దైత్యుడుం దలుపులల్లన గుద్దుచు నిన్నుగూడ కొ
క్కింతయు దాళలేననుచు నేడ్చుచు లబ్బున మొత్తుకొంచు మి
న్నంతయు గూలి బైబడినయట్లు వితాకున గూరుచుండ నా
చెంతకు తార్పుకత్తె యొక చేడియచ్చె మెలంత నారయన్ 62

గీ. వచ్చి గుడిచెంత గూర్చున్న వారి గాంచి
మీరు రక్త వర్ణాలక సైరిభాంగి
మర్కటానన పర్వతమధ్య భార
వనిత నెందైన గంటిరే యనుచు నడుగ 63

ఉ. దానవభర్త పల్కు వనితా వినుమిచ్చటి కేను వేటకై
సేనలగూడి వచ్చి గుడి చెంగట నేడ్చుచు నున్న దాని నీ
వానతి యిడ్డ లక్షణములన్నియు గల్గిన దాని నొక్క కీ
శానన గాంచి కేలొకట నంటిన నీగుడి దూరె నివ్వెరన్ 64

ఉ. ఆ కనుదోయి సూక్ష్మతయు నాచనుతిత్తుల మార్దవంబు నా
మైకరినత్వ సంపదయు మానిని నే గనుగొన్న యంత నే
నూకరగాత్రిపై మనసు సొచ్చెను నిక్కువ మెట్టులైన నా
కా కపివక్త్రగూరిచి రయంబున నేలుము నీకు మ్రొక్కెదన్ 65

ఉ. ఎయ్యది యూరు దీని విభుడెవ్వడు పుట్టిన వంశమెద్ది పే
రెయ్యది యొంటిగా నిచటికేటికి వచ్చె నిటేడ్వ గారణం
బెయ్యది నాకు జెప్పగదవే కలరూపు కిటేంద్రయాన నీ
వెయ్యది గోరినన్ సరగ నిచ్చెద దానిని నన్ను గూర్చినన్ 66

చ. అననది వల్కెనో జనవరా ఖరగామిని రీతి జెప్పెద
న్వినుము సుబుద్ధి నాబరగు నీయమ భర్త యటండు రూపునన్
మనసిజు గెల్చునైన జెలి పల్లవ సంగతి యెప్పుకోరు గ్ర
క్కున బొరుగింటి పుల్లనగు కూరయు దా రుచిగాదె యేరికిన్ 67

ఉ. విన్నటి రాత్రి యీమె యొక నీచ భుజంగుని గూడుచున్నచో
గ్రన్నన వచ్చి వల్లభుడు కన్గొని కోపముతోడ వీడు నే
డిన్నడి రేయి యొంటి మన యిల్లు చొరంగ నిమిత్తమేదియో
యున్నది యున్న యట్లు చెవుమూరక దాపక యన్న విన్నవై 68

గీ. బొంకుటకు చేతగాక యీ రంకులాడి
నోర గుటకలు మ్రింగుచు నూరకున్న
గాంచి కోపించి యొక పెద్ద కర్రతోడ
వీపు బద్దలుగా గొట్టె వెలది నితడు 69

ఉ. కొట్టిన మొత్తుకొంచు వడి గ్రుద్దులనీరొగి గ్రుక్కుకొంచు బెన్
రట్టుల బెట్టి వీధిబడి రాగతనంబున బారివచ్చి యీ
కట్టిడి రంకులాడి తన కాపురమూడుటకోర్చి దేవళం
బిట్టులు దూరె గన్గొనగ నిట్టివె యౌగద జారిణీగతుల్ 70

వ. అని కురంగగమన సవిస్తరంబుగా నామెరుంగు బోడి
తెరం గెరింగించి తలుపుచేరి యిల్లని పిలువం దొడంగె 71

ఉ. ఢాయను భీతిబొంద మగడాయను దల్పులు తీయరాదె రం
డాయను బల్కవేమి చెవుడాయెను సాము [illegible]

డాయను వేగరావె మొరడాయను లోపలజేరి యేడ్వగా
డాయను సిగ్గుపూను టిపుడాయను నెచ్చెలి మాటి మాటికిన్ 72

గీ. గొంతు పగులంగ వినువారికెంతొ చెవులు
తడకలునుగట్ట నాలుక పిడచవార
నెంతయార్చిన జెవి జొరనీకయుండె
మన్నపోతుపైవర్షంబుతొరగినట్లు 73

చ. తడిసిన నుల్కకుక్కగతి తామ్రశిరోరుహ యంతకంతకుం
గడు బిగియంగ జూచి తటకావడి గుండెను రాయిపడ్డ వే
నడవగలేక గోతిదరినక్కతెరంగున గాచియున్న యా
చెడుదనుజుండునెత్తికికజేతులువచ్చెనటంచు రోజుచున్ 74

ఆ. కొంతసేపు పాడుగుడిచెంత కూర్చుండి
రోదనంబుచేసి రోసి కూర్కి
తలుపు తీయుజాడ గలనైనగానక
విసిగి దూతిగొంచు వెడలె గుడిని 75

చ. అటువలె దేవళం బపుడె యాయమతోడను దానవేంద్రుడు
త్కటమగు కిన్కతో వెడలి గార్దభగామిని మీదిప్రేమచే
దటుకున బాయలేక మదితాతిమిదాలిచి నోరనిల్పి మి
క్కుటమగు దీనభావమున గూర్మి బయల్పడ దూతికిట్లనున్ 76

క. ఓసీ నను నీవిపుడీ
కానర విభ గాత్రితోడగలపెదవేనిన్
కానులపేరిచ్చెద నీ
యాసకు దగినట్టిరొక్క మటులుండంగన్ 77

తే. అనిన నది యెంతపనియని యపుడె బయలు
దేరి దేవాలయంబును చేరపోయి

మెల్లగా మిత్రురాలిని మేలమొప్ప
బిలిచినంతనె యాజెంత తలుపుతీసె 78

క. తలుపునుతీసిన వెనుకను
పలుకులు చెవిలోనగొన్ని బహురమ్యముగా
నలువొప్పగ జెప్పినవిని
యల ఖరవాణియు విచారమంతయు దీరన్ 79

క. చెలికత్తెయతోగుసగుస
బలుమారును మాటలాడి బహుధనమును సొ
మ్ములును వలువలునున్ రాక్షస
కుల బాడబుడియ్యనొప్పుకొన్న సువార్తన్ 80

ఉ. తిన్నగ విన్నపిమ్మటను దీయని మాటలుచెప్పి వానితో
గొన్నివికారచేష్టలను గూడుటకుబ్బున నమ్మతించె నా
చెన్నటి దూతియు న్మరలశీఘ్రముగా దనుజాధమాధమున్
దెన్నున గాంచి సర్వమునుదెల్పినురాలయ బాహ్యభూమికిన్ 81

తే. తోడుకొనివచ్చి గుడిలోన దూరుమనుచు
సైగచేసిన వాడును వేగచొచ్చి
తలుపు లోపలబిగియించి తగినయంత
గబ్బిలపుపెంట గమ్మన కంపుగొట్ట 82

తే ఉక్కలో నాపెతో సౌఖ్య మొందు చుండె
మిగుల దనలోన గుటకలుమ్రింగుకొనుచు
చేతులొండొంటితోచేర్చి దూతికయును
గడప ముందటకావలి కాచుచుండె 83

తే. ఈకథానాయికయయినయిగురుబోడి
మగడు కొట్టినవీధులుమారుమ్రోయ

పెద్దపెట్టుననేడ్చుచు వీడువెడలి
పోయి యెందును గనరాక మాయమయిన 84

సీ. ఏసూతిలోపల నేగికూలెనో యంచు
భయపడి మగడును బంధువులును
వీధివీధుల వెంట వెదకుచు బరతెంచి
జాడల బట్టి యాపాడుగుడిని
చేరి యచ్చోటను జిడుముపొక్కులు గోకు
కొంచుచు గడపలోకూరుచున్న
దూతిక బొడగాంచిదుర్మార్గురాలైన
యా లంజె ముదిముండ మూలముననె
మనకు నిన్నిపాటులువచ్చె ననుచుబలికి
యందరునుజేరియా దూతినంటగట్టి
నెమక నున్నములోనికి నెముకలేక
యుండ దంచిరి పిడిగుద్దులొకటబరపి 85



గీ. అటు పిదప నర్ధచంద్రప్రహారములను
దాని యబ్బతోడనుజెప్పుకోనుబంచి
వెనుక దేవాలయము తల్పువేసి యుంట
కాంచి లోపలనెవ్వరో కలరటంచు 86



క. ఊహించి తలుపు లొక్కట
బాహాబలమొప్పగుంజె పగిలిన మీదన్
సాహసమున లోజొరబడి
దేహంబంతయు జెమర్ప దిగులున మూలన్ 87

గీ. ఒదిగి వడకుచున్న యుష్ట్రయానను రాక్ష
సాధమునిని జూచి యలుకతోడ
వీసెగుద్దులొకట వేనవేల్ కురిపించి
కొప్పుజుట్టు బట్టి గుంజియాడి। 88

గీ. వెలుపలికి దీసికొనివచ్చి వీపుమీద
ముఖము మీదను మెడమిద ముక్కుమీది
మణుగుగుద్దుల వానలు మచ్చుచూపి
పిండిపెట్టి రభాగ్యుని నిండుగాను 89

గీ. దెబ్బలకుదాళజాలక దితిజ వరుడు
తిరుగబడి బండతనమున తెగువచేసి
వారితోడను పోరాడ వడిగడంగ
వారలందరు నాగ్రహోవార్యవృత్తి 90

చ. తటుకున జుట్టుముట్టి పదతాడన కూర్పర ఘట్టనంబులన్
చిటిపొటి మొట్టికాయలను చేరలనిండిన చెంపకాయలవ్
పటుతర ముష్టిఘాతముల బల్మరునున్వెదచల్లిదేహమం
తట రుధిరమ్ము గ్రమ్మ గరిదైత్యునినె(రనివానిజేసినన్ 91

ఉ. తాళగలేక సొమ్మసిలి దానవుడల్లనమూర్ఛవోవగా
బాలికబంధువుల్గని యభాగ్యుడు చచ్చెనటంచు నెంచి యా
భీలత జాపలోపలనుబెట్టి యభాగ్యునిజుట్టికట్టి దే
వాలయ పూర్వభాగమున యందలి గోతనువైచిరొక్కటన్ 92

క. వైచి పురంబు తలారులు
జూచిన మోసంబువచ్చు చూడక యుండన్
వే చనవలెనని గొబ్బున
నా చంచలహృదయ గొంచు నరిగిరి పురికిన్ 93

వ. అంత నిచ్చట 94

గీ. విట్చరంబు తరుమ వెరచి పర్విడివచ్చి
గోతి యందు దాగి కూరుచుండి
పంది గుంపులచట బయలను దిరుగుచు
నునికి జేసి పయికి జనగనోడి 95

క. భటులిరువురు గర్తమునం
దటు నిటు వీక్షించు చుండి యదటున దమపై
నటుదయ్యము వలె శవ మొ
క్కటి పడిన న్మూర్ఛపొంది ఘటికాద్వయికిన్ 96

క. తెలివంది కనులు విప్పుడు
నల శవమ్మం గదల జొచ్చెనా శూరులకున్
గళవళ మినుమడి కాగను
బెళపెళయని చావ చుట్టు బిట్టుగ మ్రోయన్ 97

ఉ. అంతట నాభటద్వితయ మాత్మ దలంకుచు పైకిపోయినన్
గంతున వచ్చి ఘుర్ఘరము గ్రక్కున జంపునొ క్రింద నుండినన్
సంతసమార దయ్యమిది చంపునొయక్కట యేమి బుద్ధి యం
చెంతయు జింతనొంది పనియేమియు దోచక యుండనింతలోన్ 98

గీ. చావలో నుండి "ఘనులార చావకుండ
బంధములు విప్పి నన్నింత బ్రతుకజేయు"
డనెడు వాక్యంబు విననైన నానవాలు
పట్టి తమ రాజు స్వరమౌట వడి నెరింగి 99

గీ. కట్లు విప్పదీయ కాయంబు నిండను
గాయములు చెలంగ గనులువిచ్చి
దైత్యనాథు డపుడు తన ప్రాణభృత్యుల
యాననములు జూచె దీనవృత్తి 100

క. అన్యోన్య ముఖాలోకన
ధన్యత్వము జెంది భటులు దనుజేంద్రుండున్
సన్యస్త భయభ్రాంతత
నన్యోన్య క్షేమవార్త లారసి రల్లన్ 101

క. ఆరసి తమకొాదవిన యా
ఘోరాపదలెల్ల బాసి కుట్టాపిరితో
ధారుణిలో గ్రమ్మర దా
మీ రీతిన్మెలగగనుట కెలమిం గనుచున్ 102

గీ. రాజు తమ చెంతనున్న ధైర్యంబు కతన
బయల దిరిగెడు కీటులకు భయము పడక
విభునితోగూడి యాగోయి వెడలజూడ
లేచుటకు రాజు కాలెత్తలేకపోయె 103

క. ఆ సైరిభాస్య బంధులు
చేసిన యుపచార మహిమ చేతను జరణం
బౌసమయంబున దనుజా
గ్రేసరునకు వశముగాక కీలు తొలంగెన్ 104

క. అదిగని సందేహింపక
సదుపాయ ధురీణులైన సద్భటవర్యుల్
ముదమున బైకెక్కి నృపున్
సదమలగతి నీడ్చిరతడు శ్రమచేమూల్గన్ 105

శా. ఎంతో కష్టము మీద దైత్యవిభు బైకెట్లీడ్చి యామీదటన్
వంతుల్వెంబడి మోయనెంచి యదియున్ భారంబుగా దోచినన్
స్వాంతంబుల్ప్రలియింప జింతిలి మహోపాయంబు గన్పెట్టి య
త్యంతంబున్మది సంతసిల్లి గుడి చెంతం జేరి యొక్కుమ్మడిన్ 106

క. వందిరి గడలను రెంటిని
సందిట గొనివచ్చి కట్టి సద్వాహనమున్
సుందరగతి జేసి మహా
నందంబున రాజు నందు నయమొప్పారన్ 107

క. శయనింపజేసి యిద్దరు
దయతోడ న్మూపుపైని దద్వాహనమున్
గయికొని పరమపదంబున
కయిచేర్చు మహానుభావు కరణిని నృపునిన్ 108

వ. వహియించి మృగయా వినోదమహోత్సవంబు నిర్వ
ర్తించి పునఃపుర ప్రవేశంబు చేయ నవధరించు నవనీ
ధవ పుంగవుం బురవీధుల నూరేగించు మహావైభ
వం బపూర్వంబై యుండెనా సమయంబున 109

సీ. అత్యద్భుతంబైన యా వాహనంబును
వీక్షించి కుర్కురవితతి మొరుగ
వీధి వెంటనుబోవు విధవాంగనలు చూచి
శవమని వెనుకకు సరగ నరుగ
బయనుండి బాధచే వడి మూల్గుటాలించి
తమ చుట్టమని ఘూకతతులు చేర
క్రొత్తగా శవవాహకులు వచ్చిరెందుండి
యని ప్రాతవాహకులడుగు చుండ
శ్వాననినదంబు మాగధ స్తవముగాగ
విధవల భయస్వరములు దీవెనలుగాగ
ఘూకఘూంకారములు వాద్యఘోషములుగ
నగరుచొత్తెంచె నారేడు నడిమిరేయి 110

వ. ఇట్లు పరమరహస్యంబుగా నంతఃపుర ప్రవేశంబుచేసి 111

ఉ. మంచముమీద దేహమిడి మూల్గుచుమూల్గుచు బాధనొందుచున్
జంచలదృష్టిజూచుచును జారులకెప్పుడు నిట్టిపాటులే
మించుగ సంభవించు నని మించు వెత న్మది లోదలంచుచున్
బంచత యింతకంటె బహుభంగుల మేలనుచున్వెతంబడెన్ 112

గీ. వైద్యులను బిల్వనంపించి వారిచేత
నౌషధంబులు చేయించి యక్కజముగ
బాధకుసహింపలేకయభాగ్యనృపుడు
మందుపట్టింపనీక శరీరమందొకింత 113

క. వరుసగ మొలయును దలయును
శిరమును గరములును వాచి చెప్పంగ గవీ
శ్వరులెవ్వారును నొల్లని
మరుదశమావస్థ నతడుమానక చెందెన్ 114

క. ధరణి నభాగ్యమహాసుర
చరితము విన్నట్టిపుణ్య చరితులకెల్లన్
బర వనితారతి చెడునని
పరిహాసకుడానతిచ్చె పాండుసుతునకున్ 115

క. ధరణీజన మందారా
సురమునిగణ నుత విహార సుగుణాధారా
పరిభావితరిపువీరా
దురిత నిచయ ఘనసమీరదుఃఖవిదారా 116

మాలిని. అనుపమగుణసాంద్రాయాదవాంభోధిచంద్రా
జనఘననుతిపాత్రాసజ్జనాంభోజమిత్రా
వనధికృతవిహారా వల్లవీచిత్తచోరా
దనుజచయ విరామా దర్పితారాతిభీమా
గద్యము
ఇదిశ్రీమత్సకలసుకవిజనవిధేయ
కందుకూరివీరేశలింగనామధేయ
కల్పితంబయిన యభాగ్యోప్యాఖ్యానంబను
హాస్యప్రబంధంబు నందు సర్వంబును
నేకాశ్వాసము

# సత్యా ద్రౌపదీ సంవాదము

## (ఏకపాదవృత్తము-పాట)

శ్రీకృష్ణుడొకనాడు చెలగువేడుకను
విపినంబు లోపల వెతనొందుచున్న
పాండవులనుజూచి పరతెంచుకొరకు
పయనమైయలసత్యభామనుగూడ
తనవెంటదోడ్కొని తరలి యచ్చోట
ధర్మరాజాదుల దయమీరజూచి
వారలసేమంబు వరుసగా నడిగి
సదయ వాక్కుల దుఃఖ శమనంబు చేసి
యిష్టకథాగోష్ఠి నెల్లవారలును
ముచ్చటగా ప్రొద్దుపుచ్చుచునుండి,
సత్య యా ద్రౌపది సరసనుజేరి
కుశలవార్తలనెల్ల గొంతసేపరసి
బహువిషయంబుల భాషించిపిదప
మాటలధోరణి మంతనంబునను
ద్రుపద తనూభవ తోడనిట్లనియె
అతివరో! నిన్నునేనడిగెదనొకటి
కరుణించి చెప్పుము కపటంబు విడిచి
కలరూపు సకలంబు కాంతాలలామ!
నీ భర్తలేవురు నిరతంబు మిగుల
నొకరికంటెను నొక్క రువిద నీయందు
ననురక్తులగుచుంట యత్యద్భుతంబు
నగు మొగంబులెకాని నాథులెన్నడును
వనిత! నీవయిగిన్క వహియింపగాన

నిందుకు గారణమింతిరో! నీదు
మంత్రతంత్రంబుల మహిమాతిశయమొ
వశ్యౌషధంబుల వలనిగుణంబొ
పలునోములఫలంబొ వ్రతమహత్వంబొ
నీదుజాణతనంబొ నీతివైభవమొ
తెలియంగజెప్పుము; తెలిసి నేగూడ
వాసుదేవుని నాకు వశుని జేసికొని
నీవలె సుఖియింతు నిరతభోగముల,
నని యడిగినయంత నామహాసాధ్వి
హృదయంబు లోపల నించుక యలుక
కలిగినను వయికి కనపడనీక
చింత యెల్లనడంచి చిరునవ్వునవ్వి
దుష్టాంగనలయట్లు తుచ్ఛంపుబనులు
సలుపుదు నేనని తలచితి గాన
మా పురుషోత్తముమన్ననబడయ
దగినభార్యవుగాగ దగవునీవరయ;
నీస్వభావంబెల్ల నేడిందుదెలిసె;
ననుచు మేలపుచందమున నా వధూటి
తెలివితక్కువయెల్ల తెల్లంబుచేసి
పాంచాలియిట్లని పలికెను మరియు-
శ్రమయింతయును లేక చల్లగానుండి
మందుల మాకుల మంత్రతంత్రముల
పతులవశ్యులజేయ భ్రమపడుటెల్ల
పెద్దవెర్రితనంబు బింబఫలోష్ఠి!
చెలువుని కావార్త చెవిసోకెనేని
మునువున్నప్రేమయు మొదలంట విడిచి
త్రాచుపామును వలె దలచు నానతిని

మరియు నామందులు మాయలుజేరి
వికటించి మగలకు వివిధరోగముల
పుట్టించిబాధించిముప్పునుదెచ్చు
దాన నాయింతి నందరును దూషింప
లోక నిందయు బరలోకహానియును
దలకూడి మిక్కిలి తలవంపులౌదవు
కావున సాధ్వులు కాంతులయెడల
కావింప దగదెప్డు కపటకర్మముల
కాంతుని మనసును కనిపెట్టిమెలగ
నన్నియౌషధములు నవియెయౌజుమ్మి
పాండుపుత్రులునాకు వశ్యులౌటకును
నేను వేసినయట్టి నేరమందునీకు
నుపదేశమొనరింతు —నోపికచేసి
నావలెనీవును నడచెదవేని,
వలచి పైబడుదాని వల్లభుడెపుడు
హృదయశుద్ధిగ నాదు హితబోధవినుము
మదము ప్రమాదంబు మాని భర్తలకు
నెల్లప్రొద్దునుభక్తి యినుమడింపంగ
చిత్తవృత్తియెరింగి సేవచేసెదను;
పతులకంటెను ముందు పవళింప నెపుడు
పతులువచ్చిన నర్ఘ్యపాద్యాదివిధులు
నేనె చేసెదగాని నెపము కల్పించి
పరిచారికలనెప్డు బనుపనునేను
పరపురుషుల గడ్డిపరకగాజూతు;
మగలకు భోజనమజ్జనాదులను
యుక్తసమయముల నొడగూర్తునెపుడు;
పొల్లుగా ధనధాన్యములు కొంచెమైన

వృథపోవుట సహింప; గృహము నందెపుడు
స్థల భాండ శోధనల్ తప్పకచేసి
పరిశుద్ధముగనుంతుబడతి! సర్వంబు;
పానపాత్రాదులు బరికించి తరుచు
శుచిగాగనుంచుదు శుద్ధజలంబు;
తలవాకిట మెలంగదడవుగానేను
చెడుపడంతులతోడ స్నేహంబుచేయ;
కలహమనెడు పల్కు కలలోను నాదు
చెవి సోక కుండంగ చేరివర్తింతు;
అత్తయాజ్ఞను మీర కడగివర్తింతు
కలబంధువుల యుక్తగతి గౌరవింతు;
నతిథిసత్కారంబు లరసిచేసెదను;
శాంతత వహియింతు సర్వంబునందు;
ప్రాణంబు పోయెడు పట్టులనైన
నీతిమాలినపని నే జేయకుందు!
చనవిత్తురని భీతినడలి వల్లభుల
చులుకసేయక చరించుదు భక్తితోడ
పాండవాగ్రజుతోడ బంక్తిని గుడుచు
యతులను విప్రుల ననుదినం బేనె
యన్నపానాదుల నరసికన్గొనుచు
భూషణాంబర దానముల సత్కరింతు
మరియు ధర్మాత్మజు మందిర మందు
పలుదెరంగులనొప్పు పనులవర్తిల్లు
భృత్యులకృత్యముల్ వేర్వేరయెరిగి
జీతబత్తెంబుల చెలువరో! యిత్తు
నదిగాక భద్రగజాశ్వాదులకును
ఖాద్యంబులొడగూర్పగా నియమింతు

తగినజనంబుల దరితప్పకుండ
ఒకపనియననేల? యువిదరో! వినుము
ఆబాలగోపాల మందర నేనె
అర్థరీతిని జూచి యరయుచుండుదును
పాండవులు కుటుంబ భారమంతయును
నామీదనే పెట్టి నాతి నిర్భరత
దారు చరింతురు తమ యిష్టలీల
వేగ జాము గలుగ వెడనిద్రపోదు
కాని నాకెప్పుడీకార్యభారమున
నాహారనిద్రల కైన తిన్నగను
నెడములేదు – వినుమీ యింద్రజాలంబె
పాండు కుమారులపై ప్రయోగించి
వారల నే వశవర్తులగాగ
నింతి! చేసికొనితి; నింతియకాని
నీవు చెప్పెడినట్టి నెరజాణ తనము
మంత్రతంత్రంబులు మరులు మందులును
నింద్రజాలపువిద్య లెరుగ నేమియును
అన సిగ్గువడి సత్యయనియె ద్రౌపదికి
నే నెరుంగమి చేతనిట్లడిగితిని
నా నేరము క్షమించి నవ్వగ గొనుము
నా మాటలెల్లను నారీలలామ!
పరమసాధ్వివినీవు పరికించిచూడ;
ననిన బాంచాలియు నాననాబ్జమున
చిరునవ్వుమిక్కిలిచెంగలింపంగ
సత్యభామను జూచి చనువున ననియె
వదినెరో నీప్రియవల్లభునీవు
వశపరచుకొనెడు వరసాధనంబు

తగనీకుజెప్పెద ధర్మాన్వితముగ
పతిని మించెడునట్టి పరమ బాంధవులు
మరియెవ్వరునులేరు మహిమీద సతికి
సర్వసౌఖ్యములొంద సాధ్వీమణులకు
పతియె విధానంబు పర్వేందువదన!
పతియనుగ్రహమును బడయు కాంతలకు
సకలగౌరవములు సర్వవస్తువులు
భూషణాంబరములు పుత్రసంపదయు
సద్గతియును గీర్తిసకలంబు గలుగు
కావున పతియాజ్ఞ కలలోననైన
మీరక మెలతుక మెలగంగ వలయు
కష్టపడినగాని కరముసౌఖ్యంబు
కలుగదెవ్వరికిని క్ష్మామండలమున
కావున దేహంబు కడుదాచుకోక
పనిపాటులనుజేసి పతిచిత్తమెరిగి
ప్రేమంబు భక్తియు ప్రియము జూపుచును
వరవర్తనంబున వర్తింపవలయు
నీ వినయంబును నీసుగుణముల
నీపనిపాటుల నీసుచరితల
వీక్షించి నిత్యంబు విభుడు తనంత
ప్రియమారమన్నించి ప్రేమించునిన్ను
భర్త నీమందిర ద్వారంబుచేర
సంభ్రమంబునలేచి సలువుము భక్తి
గృహముచొచ్చిన వెన్క గ్రిందివారలను
పనులుచేయంగను బంచితినంచు
నూరకుండక నీవు నుపచారములను
చేతనైనట్టుగ చేయుముపతికి

ఏకాంతమున నీకు నెప్పుడైన మగడు
చెప్పినపలుకును చెలులతోనైన
మరుపుననైనను మరిచెప్పకమ్మ
చెప్పితివేనియు చెడుపడంతుకలు
నీ మీదనేదియో నెపము కల్పించి
లేనిపోనివి చెప్పిలేమ! నీమగని
చిత్తము విరసంబు చేయుదురవల
భర్తకు ప్రియులైన వారలనెపుడు
నాదరింపుము శీతలాలాపములను
భర్తకుగిట్టనివారలు నీకు
ప్రియమిత్రులైనను విడువుమువారి
భామ! నీ దగ్గర బంధులతోను
నేకాంతమునను నీవేకాసనమున
మగువరో! కూర్చుండి మాటాడబోకు
చెడుపడంతులతోడ చెలిమి చాలించి
సద్వర్తనము గల్గు సాధ్వులతోనె
సతతంబు స్నేహంబు సలుపుచునీవు
గడపుసద్గోష్ఠిచే కాలమెప్పుడును
నే జేయుహితబోధ నెమ్మనంబునను
దృఢము గాగను నిల్పి తిరుగుదువేని
సకలసౌభాగ్యముల్ సమకురునీకు;
వసుధలోనుప్రతిష్ఠవచ్చునిక్కముగ
అనిన సంతోషించి యాసత్యభామ
ద్రౌపదీదేవికి దనకృతజ్ఞతను
తెలిపి యెన్నెన్నియో దీవనలిచ్చి
రాజ్యంబువిడిచి యరణ్యంబునందు
కష్టముల్పడుచున్న కారణమునను

వగబొందుచుండంగ వలవ దటంచు
ధైర్యంపుమాటలు తగురీతిజెప్పి,
మరలరాజ్యము పొంది మగలతోగూడ
నతివేగసుఖియింతువంచునోదార్చి;
పాంచాలి వీడ్కొని భర్తతోగూడ
ద్వారకాపురికేగి ద్రౌపదీదేవి
చేసినహితబోధ చిత్తమందుంచి
కాంతునిచిత్తంబు కనిపెట్టిమెలగి
సుచరిత్రమున సత్య సుఖియింపుచుండె
ద్రుపదాత్మజకు సత్యతోడనైనట్టి
సంవాదమును దీని జదివి సుందరులు
వరగుణంబులు గల్గి వర్తింతురేని
పతులప్రసాదంబు పడసియెల్లప్డు
సకలశుభంబుల సత్కీర్తినొంది,
యిహపరసుఖములనెల్లగాంచెదరు

# పత్నీవ్రతప్రబోధము

1892 వ సంవత్సరంలో వీరేశలింగంపంతులుగారు సత్యరాజాపూర్వ దేశయాత్రలు అనే నవలను రెండు భాగాలుగా ప్రకటించారు. మొదటిభాగం పేరు ఆడుమళయాళం. రెండోభాగం పేరు లంకాయాత్ర. ఇంగ్లీషులోని జొనాథన్‌స్విఫ్ట్ 'గలివర్స్ ట్రావెల్స్' కు 'సత్యరాజాపూర్వదేశయాత్రలు' స్వేచ్ఛానుసరణం.

స్వీయచరిత్రలో ఈ సత్యరాజాపూర్వదేశయాత్రలనే గ్రంథరచనకు ప్రేరణం గూర్చి ఆయన ఇట్లా చెప్పుకున్నారు.

"స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యారాజా పూర్వాదేశ యాత్రల యొక్క ప్రథమ భాగమును రచించి ప్రకటించితిని"

భారతదేశంలో స్త్రీలపట్ల జరుగుతున్న అన్యాయాలు, చూపుతున్న వివక్ష 'ఆడుమళయాళం'లో పురుషులపట్ల జరుగుతున్నట్లు పంతులుగారు కల్పనచేశారు. హిందూసంస్కృతిలో పసితనం నుంచీ ఆడపిల్లలకు పాతివ్రత్యం బోధిస్తున్నట్లుగా అక్కడ ఆడుమళయాళంలో మగపిల్లలందరికీ చాలా చిన్న వయసునుంచే పత్నీవ్రతం బోధిస్తారు. హిందువులు తమ వితంతువులకు కేశఖండనం పాటిస్తే ఆడుమళయాళంలో విధురులందరికీ ముక్కుకోసివేస్తారు. ఇక్కడ భోగస్త్రీలున్నట్లే అక్కడ భోగపురుషులుంటారు. ఇక్కడ బాలికలు పాఠశాలకు పోనట్లే అక్కడ మగపిల్లలు బడికి పోరు. సమస్త నీతిశాస్త్రాలు, కావ్యాలు ఆ దేశంలో పత్నీవ్రతాన్ని ప్రబోధిస్తాయి. భారతదేశంలో స్త్రీలు ఆచరించే నోములు, వ్రతాలు మించి ఆడుమళయాళంలో పురుషులు ఆచరిస్తారు. మొత్తానికి భారతస్త్రీకి పూర్తిగా నకలు బొమ్మ ఆడుమళయాళంలో పురుషుడు.

ఆడమళయాళంలో అక్కడి పెద్దలు, పురాణాలు బోధించే పత్నీవ్రత బోధిని అనే శాస్త్ర సారాంశాన్ని వీరేశలింగం పంతులుగారీ విధంగా సత్యరాజాచార్యులు అనే పాత్ర ద్వారా వెల్లడింపచేశారు. వెక్కిరింతకు, వెటకారానికి, వేళాకోళానికి ఆధునిక తెలుగు సాహిత్యంలో ఈ రచనే శ్రీకారం చుట్టిందని చెప్పాలి.

# శ్రీసత్యరాజాచార్యకృతాంధ్రీకృత
# నవరత్నమంజరి

క. పురుషునకిమ్మహి బత్నియె
పరమంబగుదైవతంబు పత్నీసేవన్
నిరతముచేసెడి పురుషుడె
పరమున నిహమున సుఖముం బడయుంజుమ్మీ 1

గీ. ప్రతి దినంబును బురుషుండుపత్నికంటె
ముందుగాలేచి నదిలోనమునిగి జలము
కలశమునదెచ్చి నిజపత్నికాళ్ళకడిగి
తాను శ్రీపాదతీర్థంబు తాగవలయు 2

క. స్త్రీపాద తీర్థ సేవన
మే పురుషుడు చేయు నెన్నియేడులు ధరలో
నాపురుషు డన్నియుగములు
పాపములంబాసి మోక్షపదవి సుఖించున్ 3

గీ. కుష్ఠురోగిణియైనను గ్రుడ్డిదైన
భూరివికలాంగియైనను ముసలిదైన
బత్నియెంగిలి భుజియింప వలయు సతము
పుణ్యలోకంబు గాంక్షించు పురుష వరుడు 4

క. ఏపురుషుడతివ యెంగిలి
పాపపుమతినేవగించి భక్షింపండో
యాపాపాత్ముడు నారక
కూపంబున గూలుజూవె కోటియుగంబుల్ 5

క. దూరమున జూచి పత్నిని
గారవమునలేచి యొంటి కాలునబురుషుం
డోరగ వంగగ వలయును
గూరిమి గూర్చుండ నిల్వగూడదునుమ్మీ 6

క. పురుషుడునుగార్ధభమున్
స్థిరముగ దండనము లేక చెడిపోదు రిలన్
గరుణాయు దలపక నెలకొక
పరియైనన్ గొట్టవలయు బత్నిపురుషునిన్ 7

గీ. పత్నిగొట్టినదిట్టిన బాధయిడిన
భోగపురుషుల బొందిన బోదవక్షీర్య
దరుణియే పురుషునకును దైవమనుచు
భక్తి ననయంబు సేవింప వలయుజుమ్మీ 8

గీ. అతివలకు స్వేచ్ఛ భూషణమైన యట్లు
పురుషులకు లజ్జయే మహాభూషణంబు
సూర్యచంద్రులు మొగమైన జూడుకుండు
పరమపత్నీవ్రతుడె పొందు పరమ గతులు. 9